# తారకనామప్రభావము.

—:o:—



కొండపల్లి వెంకటదాసు
ప్రణీతము.

---

మచిలీపట్టణము

సుధర్మ ముద్రణాలయమునందు

ముద్రితము.

---

1922.

శ్రీ

# తారకనామప్రభావము.




కొండపల్లి వెంకటదాసు ప్రణీతము.

బ్రహ్మశ్రీ చింతలపాటి రామమూర్తిశాస్త్రి

మహారాజశ్రీ వల్లభనేని రామకృష్ణకవివర సంస్కృతము.

బందరు, సుధర్మ ముద్రణాలయమునందు.

ముద్రాపితము.

1922

# ఉపోద్ఘాతము.

ఆర్యులారా!

నాకు సంస్కృతాంధ్ర పాండిత్యం బిసుమంతయు లేకపోయినను, వరకవిత్వముచే నీ పాత్రంబును రచించితిని. ఇందులో కొలదిపాటి దోషంబు లుండవచ్చును. వాటిని ప్రాజ్ఞులు మన్నింతురుగాక.

ఈ గ్రంథమును పరిష్కరించిన వల్లభనేని రామకృష్ణయ్య, చింతలపాటి రామమూర్తిశాస్త్రి గార్లకు వందనము లర్పించుచున్నాను.

పొన్నపాడు,
17-8-22.

ఇట్లు విన్నవించు విధేయుడు,
కొండపల్లి వెంకటదాసు.

# తారకనామ ప్రభావము.

—— ।ం। ——

కం॥ శ్రీపవిత్రవంశపావన
మాధవముఖ వినుతి పాత్ర పరమపవిత్రా ।
కోసలదేశాధిప నిజ
దాస జనావన సునామ దశరథరామా ॥ ౧.

కం॥ మతి నతులిత హర్షంబున
సతతము నే నిన్ను వినుతి సలిపెద రామా ।
పతిత జనావన నిపుణా ।
హితవుగ నను బ్రోవు మెప్పు డినకులరమణా ॥ ౨.

గీ॥ విద్యయును బుద్ధి నీజాలు విమలహృదయ ।
వేదములకాది మూలమా వేదవేద్య
ప్రథమ కమలంబు నందుండు ప్రణవరూప ।
విఘ్ననాథుని సద్భక్తి వినుతసేతు ॥ ౩.

కం॥ భారతి నిను బ్రార్థించెద ।
వారిజదళ సదృశనేత్రి వర్ణితగాత్రి ।
భూరిదయామతి సతతము
చేరి నటింపుము మదీయ జిహ్వాగ్రమునన్ ॥ ౪.

కం॥ శ్రీరామా నిన్నెపుడున్
శ్రీరామా వేడుకొందు స్థిరమతితోడన్ ।

శ్రీరామా నను బ్రోవర ।
శ్రీరామా సుగుణధామా శ్రీరఘురామా ॥ ౫.

వ॥ ఇట్లిష్టదేవతాస్తుతి యొనర్చి. ౬.

కం॥ రామునకు నీలమేఘ
శ్యామునకును సకలముని హృదభిరామునకున్ ।
భూమి సుతాహృత్కువహిమ
ధామున కఘదళన పుణ్యతర నామునకున్ ॥ ౭.

సమర్పితంబుగా నొనర్పంబూనిన తారకనామ ప్రభావంబను యక్షగాన ప్రబంధంబునకు కథావిధానం బెట్టిదనిన.

కం॥ భూమికి దొడవై సిరులకు
ధామములై జొన్నపాడు తద్దయు నొప్పున్ ।
ధీమహితులతో రెండవ ।
నామముచే శ్రీజనార్దన పురంబనగన్ ॥ ౮.

వ॥ అందుగల పరమభాగవత శిఖామణులగు పుణ్యపురుషులొక్క నాడొక్క పుణ్యస్థలంబున గూర్చుండి పుణ్యకథా కాలక్షేపంబు సేయుచుండ నొక్కండు లేచి యో మహాపుణ్యులారా! మన గ్రామ నివాసియగు వెంకటస్వామి యను నామాంతరముంగల వెంకటదాసుండను భక్తుండు విరక్తుండై సద్గురూపదేశంబుచే శ్రీహరిని స్మరింపుచు కృతార్థుండయ్యెనని, మున్ను కొంతవింటి, నీవు నామహాత్ముని సచ్చరిత్రంబును తారకనామ ప్రభావంబును సవిస్తరంబుగా దెలిసెనేని వక్కాణింపుండన నందొక్కం డిట్లనియె, నో మహాత్మా వినుము. వెంకటరెడ్డి

కులోద్భవుండును వెల్లసిరి గోత్రుండును సుకవిజన మిత్రుండును కొండపల్లి వంశపయః పారావారరాకా శశాంకుండును నగు శ్రీ మత్తాతిరెడ్డికిని పతివ్రతా తిలకంబగు యాదిలక్ష్మికిని జన్మించిన వారిలో ద్వితీయుండును నగు వెంకటదాసుండను దేవా! మాయారూపంబగు సంసారంబున బురదలో కుమ్మర పురువు చందంబున మెలంగుచు భక్తవరదుండగు శ్రీయఃపతిని స్మరించు విధంబు గురు కరుణచేగాని తెలియదని యెవ్వారు తన కుపదేశం బిచ్చుటకు తగుగురువు లేమింజేసి ప్రహ్లాద రక్షకుండగు నరహరినే తనకు తారక ముపదేశమిమ్మని మూఢభక్తిచే ప్రార్థించుచు యమనియమ మాద్యష్టాంగ యోగనిష్ఠా గరిష్ఠుండైనను పంచముద్రల గుర్తెరిగినను పద్మాసనారూఢుండై భ్రూమధ్యంబున వెలుంగు చిత్స్వరూపుండగు పరమాత్మను జూచుట కెంత ప్రయత్నించినను నూటయెనిమిది దివ్యతిరుపతుల సేవించినను నీ చరాచర ప్రపంచబంతయు నిండియున్న విష్ణువుని గనుంగొనుట యసాధ్యంబనియు నది నైరాగ్య భక్తిచేగాని సాధ్యంబుగాదనియు సాధ్యంబుగాకున్న ముక్తి లేదనియు నిశ్చయించి యా గోవిందుని తన డెందంబున గుమురు పరచి యిట్లు పలుకందొడంగె వినుము.

కం॥ శ్రీరామ రామ యనుచును
బారాయణ సేతు నెపుడు బరమప్రీతిన్
ధీరా! రే గురువులైన యీ
తారక ముపదేశమిచ్చి దనుపుము శౌరీ॥ ౧౦.

## సావేరి—ఆది.

ప॥ రామ రామ శ్రీరామా రామా। రామాయనుటయె నా వంతు॥

అ॥ ఏమరకను నను। పామరుడనకను। భూమిని నేలుట నీ వంతు॥

చ॥ దాసుల బ్రోచె దాశరథి నీవు। దోసిలొగ్గుటయు నా వంతు దాపహోవనా। దోసములెన్నక వాసిగ నేలుట నీ వంతు॥

చ॥ పన్నగశయనా పతితపావనా। సన్నుతించుటయె నా వంతు కన్నతండ్రివలె కోర్కెలిచ్చి దయ నన్ను బ్రోచుటయె నీ వంతు రాతిని నాతిగ జేసిన సీతారామ నుతించుటె నా వంతు॥

చ॥ పాతకములు బడగొట్టి బ్రోచుటయు పరమపావనా నీ వంతు

చ॥ పక్షివాహన రక్షకుండవని। దీక్షగ వేడుట నా వంతు కక్షవహింపక దక్షుణమే నను రక్షణసేయుట నీవంతు॥

చ॥ ధరను వార్వన పురనివాసయని ధ్యానించుటయే నా వంతు॥ కరవరదా నను కరుణను బ్రోచుట కొంగుదించుటయే నీ వంతు

క॥ శ్రీరమణ నీదు నామము
నారసనను నిల్పుదెప్పుడు నరహరియిపుడే।

సార కృపనన్ను గావుము ।
కోరిక లిడి జొన్న పాటి కోదండాగ్రిమా ॥

కాంబోది—అట.

ప॥ రామ రామ రఘువంశతిలక శ్రీ। రామ శరణు శరణు

అ॥ కామజనక శౌరీ రామనన్ను వేడ్క గావు శరణు శరణు।

చ॥ సూర్యవంశతిలక సుగుణాంబు నిధి దయజూడుము శరణు శరణు । వేరుసేయకనన్ను । వేడ్క బ్రోవుము నృపవీర శరణు శరణు ।

చ॥ వాతమతినిత్తునో యనసంశసేవనీ। కృతిని శరణు శరణు॥ శతముఖనుత రామ । పతితపావన నన్ను సాకు శరణు [శరణు ॥

చ॥ దశరథనందన శశిధర మతగుణని ధాన శరణు శరణు॥ శిశువై యుండి రక్కసుల గూల్చు। మున్యవనకేలో శరణు [శరణు ॥

చ॥ దాసుల హృదయమున దాగియున్న సుగుణధామ శరణు శరణు । మోసపుచ్చక దయ జేసిమాన్పు నా । గాసి శరణు శరణు ॥

చ॥ ధరలో జనార్దన। పురనివాసగిరి । ధైర్య శరణు శరణు। శరణను దాసుల గరుణ బ్రోచు భక్తవరద శరణు [శరణు ।

కం॥ శ్రీహరి నిను బ్రార్థించెద
శ్రీహరి సకలాంతరంగ చిన్మయరూపా ।
శ్రీహరి నను వే బ్రోవర ।
శ్రీహరి ప్రహ్లాదవరద శ్రీలక్ష్మీశా ॥

వ॥ అనుచు శ్రీహరిని నుతింపుచున్న కొన్ని దినంబులకు నొక పుణ్యకాలంబున తద్గ్రామస్థులగు భగవద్భక్తులచే నిర్మింపంబడిన రామాలయంబునకు కమేయ సుగుణ గరిష్ఠులును, పరమభాగవత శ్రేష్ఠులును పుణ్యపురుషులు నగు జనులును, మఱియెందఱు పుణ్యాత్ములును నరుదెంచి యద్దేవున కభిముఖులై నిల్చి, ఓం నారాయణాయనమః, సూర్యచంద్ర నేత్రాయ నమః, దశరథనందనాయనమః, ప్రహ్లాదనారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాది పరమభాగవత వినుతపాదారవిందాయనమః, భక్తపాలకాయనమః యని స్మరింపుచు నర్చన వందనాదులనర్పి యొక్కచో గూర్చుండి భగవద్గోష్ఠినున్నతఱి వెంకటదాసుడు స్వేచ్ఛ నచ్చటికివచ్చి వారిం గాంచి పరమానందంబు నొంది

గీ॥ "భక్తులే నేను నేనయా భక్తులరయ భక్తులకు నాకు భేదమావంత గలదె"

యను భగవద్వాక్యంబుగలదు. గావున వీరా శ్రీహరి స్వరూపులు, యీ పుణ్యాత్ముల దర్శనంబున నా జన్మంబు తరించె, కృతార్థుండనైతినని యుప్పొంగుచు నా శ్రీరాముని యడుగుదమ్ములంబడి యానంద బాష్పంబుల దర్పదంబులం

గడిగివేచి యప్పరమ భాగవతులకు వేర్వేరదండప్రణామంబు లొనర్చి వారి దీవెనలం గైకొని తద్దర్శన స్పర్శన సల్లాప జనిత పరమాహ్లాదంబున మేనుమరచి కొంతవడికి దెలిసి శ్రీహరి నిట్లు నుతింపందొడంగె.

ముఖారి, ఆది.

ప॥ పట్టువిడువ పట్టువిడువను శ్రీహరి నిను వేడ॥ పట్టు॥

అ॥ పట్టిన పట్టు నేవిడువ వట్టిమాటకాదు నరహరి। గట్టిగ
నను బ్రోవకున్న నాదువారి నౌనదు శౌరి పట్టు॥

చ॥ అష్టదిక్కుల నావేడ్క। యిష్టములేక నోప్రోడ। అష్టా
క్షరిచే నిను స్మరియించెద. కష్టము దీర్చుము కరివరదా.

చ॥ దాసులను గాచితివని విని దశరథతనయా నుతియించెద
దోసముల బోనాట్టు నన్ను। దోషరహిత బ్రోవర
[ తండ్రీ। పట్టు॥

చ॥ గట్టిగా కేశవ నీవు నాపట్టు గలిగియుండవేని యీ
పట్టినపట్టు విడువను పరులను నే వేడబోను। పట్టు॥

చ॥ ఆపదలనెడబాపుమనుచు। తేపతేపకు నిన్ను వేడెద। ఆ
పదోద్ధారకనాదు పాపములబడ జమ్మిబ్రోవర॥ పట్టు॥

చ॥ ఎక్కువని యితరదైవముల। నెప్పటికి నే వేడ శరసుత।
దిక్కునీవని మొక్కెద నా। దిక్కునీవై బ్రోవు
[ మయ్య। పట్టు

చ॥ గట్టిగ జనార్దన పురమున । కట్టడిగ శ్రీ లక్ష్మిని గూడి ।
గుట్టుగా దేవాలయమునను । కట్టువడి నివసించిన శ్రీ
హరి ॥ పట్టు విడువ పట్టు విడువను ॥

కం॥ పక్షి పతిగ మన భక్తుల
పక్షపువాడవని నీమ పాలబడితి । నర్క
కక్ష వహింపక శౌరీ ।
తక్షణమే బ్రోవుమయ్య తారకనామా ॥

నాదనామక్రియ ఆది.

ప॥ జాలమేల శ్రీరామా । శౌరీ స్మరియించెద జాలీ లేనా
[రఘురామా ॥

అ॥ జాలి లేక నన్నేలకున్న బ్రతి। మాలియు నినుహరి ప్రస్తు
తింతు యిక ॥ జాల ॥

చ॥ అన్నా నిన్నే వేడెద । నిటలాక్ష వినుత కన్నులయందు
నిల్పెద । పన్నగశయనా పన్నరక్షకా । వెన్న దొంగ
నిను సన్నుతించెదను । జాల ॥

చ॥ పోషింపుమయ్య శ్రీహరి । దోషుడనని । భాషింపగ
దగదు కంసారీ । ఘోషబడెక నాకోరికలొసగర । దో
షరహిత నే దోసిలొగ్గితిని ॥ జాల ॥

చ॥ దండి యసురుల బట్టి। ఖండనమునను । చెండి వేసిన శౌరి
యుండజ వాహన పుండరీకాక్షయుండ జేరెదను కుండలి
[శయనా ॥ జాల॥

చ॥ ధరను జనార్దన పురమందుండె। శ్రీరామచంద్రి। కరుణ పురజనుల బ్రోచుమండి। కరివరదుడ నిరతము తారక మా౹ నరగున వెంకటదాసున కీయర ॥ జాల ॥ ౧౫.

శం॥ హరిదాసుల రక్షింపను
కరమందున మున్ను బిరుదు గట్టితివని నే
కరుణాళూ నిను నేరెద
కరుణ తలిర్పంగ బ్రోవగదరా శౌరీ॥ ౧౬.

నాదనామక్రియ– ఆది.

ప॥ ఏమిరా రామా యేమిరా పల్కవదేమిరా శౌరి॥

అ॥ కామజనక నా దేవుడవని నీ। కోమలపదములు గొలిచి మొక్కినను ॥ యేమిరా ॥

చ॥ ఎన్ని విధంబుల నన్నుతించినను। పన్నగశయనా పాలింపవవహా ॥ యేమిరా ॥

చ॥ దంశీవాడవని యుండను జేరితి। పుండరీకాక్షయ। జాడ స్వరూప ॥ యేమిరా ॥

చ॥ కరివరదుడవని। మఱి మఱి నేడితి। గరుడగమన నను కరుణను బ్రోవర ॥ యేమిరా ॥

చ॥ కూరిమి వెంకటదాసుని మొరవిని తారక మొసగుచు। గోరిక లీయరా ॥ యేమిరా ॥ ౧౭.

కం॥ పక్షి-ద్రి గమన నాపై
యక్షణంబగు దయాల హరిని బరవృద్ధ
యీ క్షణమున రావే ప
ద్మేక్షణ చేలంబు లిచ్చియేలవె కృష్ణా॥

కం॥ నారాయణ నీ నామము
కూరిరడ జామీళు డెపుడు గోకయూడిక నీ
నా రాయణుడను కొమరుని
పేరున బిలువంగ బ్రోవవే సత్కరుణా॥

వ॥ అనుచు ననేక విధంబుల శ్రీహరిని స్మరింపుచు స్వామీ
నాతో బలుకవా? పలికి తారక మీయవా? యని పలికియు,

కం॥ పలుకవు తారక మీయవు
పలుమారుల్ వేడుచున్న పన్నగ శయనా।
నలువను గన్నముకుందా
యలుకా తగదయ్య చూడ నన్యుని గాక॥

కం॥ తారక మిచ్చిన సరియె
తారక మీకున్నరాక్షస తక్షణమే ని
న్నారడి బెట్టెద శౌరి
గారడీ వాడనుచు వేయిగతుల ముకుందా

వ॥ అనుచు నద్దేవకీ మున శ్రీహరిని బెక్కువిధంబుల నుతిం
పుచు నో కేశవ, యో మాధవ, యో పుండరీకాక్ష
యో దామోదర, యో జనార్దన, యో యచ్యుత, యో
యనంత, యో జగన్నాథ, యో భక్తవత్సల, యో దీనశరణ్య,

హో యాపద్బాంధవ, హో గోవింద, హో వైకుంఠవాస, నాకొక్క పరి దర్శనం బీయవా? యిచ్చి యొక మాటాడవా? మాటాడి తారకం బొసంగవా? యనుచు బలుమారు రెట్టించి వలుకకున్న నారూఢంబగు వైరాగ్యంబునదను త్యాగంబునకు నిశ్చయించి చేతనున్న తంబురా తాళంబులక్రిందనుంచి యూర్ధ్వముఖుండై శ్రీహరియందు చిత్తంబు జేర్చి తత్ప్రియత్నం బరయుచుండు తరి నచ్చినున్న భగవద్భక్తు లదిచూచి యొకరి మొగ మొకరు చూచుకొనుచు విస్మయచిత్తులై వెంకటదాసుని దృఢవైరాగ్యంబునకు సంతసించి యో భక్తుండా నీకిట్టి వైరాగ్యంబు కల్గుటకు కారణమేమని యడిగిన వారిం జూచి ముకుళితకరకమలుండై యో మహాత్ములారా! వినుండు.

శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం । స్పర్శనం పాపనాశనం ।
భాషణం తీర్థభూతం స్యాత్ । సదనం మోక్షదాయకం.

వ॥ అను ప్రమాణంబు గలదు గావున మావంటి దీనులకు మీవంటి సత్పురుషుల దర్శనంబున నేకదా జన్మసాఫల్యంబు గా గలదు. కృతార్థుండనైతి ననుచు వారికి దండ ప్రణామంబు లాచరించి యో మహాత్ములారా,

కం॥ మీరల నుడివిన ప్రశ్నకు
గారణమున్నది వినుడు నేను కరంభక్తిమెయిన్ ।
ధీరమతి వేడితిని నే ।
తారక మిమ్మనుచు సుగుణధాము నాత్రిమున్ ॥

వ॥ అనినవారిలో సరస్వతి శేషయ్య యను భక్తాగ్రేసరుం డిట్లనియె.

గీ॥ పంచవటి. ఎద్దిబహువిధ దురితంబు లెల్లఁదోలు |
నెద్దిసకలేప్సితంబుల నీయఁజాలు |
దేనినార్యులు నాకుపదేశమిడిరో |
దేనిఁగోరుచునుంటివో మానసమున |
దాని మహిమంబు దెలిపెద దయదలిర్ప |

కం॥ తారకమె రాముడనుచుఁ |
దారకముఁ శివుఁడు మదిని ధ్యానించిలన
త్సారముగని తాగాంక్షి
తారకముం దెలియ జెప్పెదగ్గయు బ్రీతిఁ ॥

కం॥ గాంక్షి నొసగిన తారక
సారముగని యోక్షమునుండ్రు సన్నుతపసులా
తారక మొసంగెదను నే
కోరికలర నీకు నేమగోనుమఁ శిష్యా ॥

కం॥ తారకమే యోంకారము
తారకమే సింహియుండె దాభువనములఁ ॥
తారకమగు యీపావన
తారక ముపదేశమిచ్చెదఁ గొనుమిపుడే ॥

వ॥ ఇట్లా భాగవత శిఖామణి తారకమిచ్చెదనని వక్కాణింప నంత వెంకటదాసుండు పరమానందంబునొంది యో మహాత్మా! ఇదెంతటి సుదినము నేనెంతకాలము నుండియో

తారకోపదేశంబు సేయందగు గురువర్యుండు లేక నలుజడి వడుచు నాదరయాళుండగు శ్రీహనుమనే యుపదేశమిమ్మని చిరకాలమునుంచి వేడుకొనుచుండ నేటికా శ్రీయుఃపతికి నాయందనుగ్రహము గల్గెగాబోలు మీారూపంబున సాక్షాత్కరించె నాహా, మీారా గోవిందులుగా నాడెందంబునకు దోచుచున్నయది. నేడుగదా నాజన్మము సాఫల్యమునొందినది, యిప్పటికి గదా కృతార్థుండనైతినను మని నాతని యడుగులంబడి యానంద బాష్పంబులంగన్నీరు మజల నిజశిరంబున నాభక్తాగ్రేసరు పాదంబుల గడిగి యార్తంబుల దనర్చ జల్లుకొని కొన్నితనివిదీర గ్రోలి నిల్చి మహాత్మా నన్నుకడతేర్పవే యని చరణంబులంబడి పట్టువీడక నట్లనె యున్నంత నాపూజ్యా వేంకటదాసుభక్తి విశ్వాసంబులకును వైరాగ్యంబునకును సంతసించి శిష్యా శుద్ధచిత్తోద్భవ యుని దీవించి తన చేతులచే లేవనెత్తి గూర్చుండబెట్టి, బంగారునకు పరిమళము గల్గునట్లును యద్దమునకు మెరుగబ్బినట్లు నుండు వత్సా యిదిగో తారక మువదేశమిచ్చుచుంటి గైకొమ్మని,

కం॥ శ్రీరామ నామమును యీా ।
తారక సారామృతంబు ద్రావుమి కేవుడా ।
శ్రీరాముడు నీకిచ్చును ।
సారంబగు నమృతపదవి సరగున శిష్యా ॥

వ॥ ఇట్లుపదేశించి మఱియును,

(సీ తా రా మాం జ నే యం లో ని ప ద్య ము లు)

కం॥ ఆది పరబ్రహ్మాపరి ।

అ॥ దశేశ సమిత్స్యు నాదనుజారి శ్వేతలోన । దర్శన మొ
నగుచు దనిపె నంబరీషు ॥ దర్శన ॥

చ॥ నరగుణ మకరి । శిరము జక్రమున దరిగి । కరిని గాచిన
శ్రీ । హరి సీతు లక్ష్మితో ॥ దర్శ ॥

చ॥ నార్ధదముని మొపుకు । నారశింహాయనుచు । నారా
యణాను శేయు । నారాయణమూర్తి ॥ దర్శన ॥

చ॥ ధరలో జనార్దన । పురవర స్వామిడై । సరగున భక్తుల।
సంరక్షించు హరి ॥ దర్శ ॥

వ॥ ఇట్లాధక్తాగ్రేసరుండు తారకనామ ప్రభావంబు దెలియం జెప్పి శిష్యుని యభిప్రాయంబు గ్రహింపగోరి యో శిష్యుడా నే నీయందగిన తారకంబను నిధానంబు నీకిచ్చితి, నింక నీయందగు గురుదక్షిణంబు నాకిమ్మనిన వెంకటదాసుం డిట్లనియె, నో మహాత్మా మీర లనుగ్రహించినది దివ్యజ్ఞానము. అట్టి జ్ఞానంబున విచారింప నీ చరాచరప్రపంచంబునకును మీకును నాకును భేదం బిసుమంతయుం గానరాకున్నయది. ఇదియుం గాక నిష్కామి కీయందగిన దక్షిణయును లేదు. అయినను శ్రీనుస్వామియుణ స్వభావులగు మీరు కోరితిరి. కావున నీ తారక నామ పారాయణఫలం బొసంగెద గొనుండనిన నంత నా గురుం డమితానందంబునొంది యో పుత్రా,

"శ్లో॥ బ్రహ్మణోన్యం నకించన ।" యను న్యాయంబున బ్రహ్మముకన్న వేరు కొంచమైనను లేని మాట నిజమే. అట్టి జ్ఞానంబలవడెనో లేదో యను సంశయమున నే నిట్లు కోరితిని.

నీవు నిషాల్కియిపై యీయయరాని ఫలంబిచ్చెదనంటివి. గావున దానినే పరిగ్రహించితినన్న శిష్యుని తన తొడలపై గూర్చుండం బెట్టుకొని పుత్రప్రేమచే గౌగలించి వత్సా యెన్నియిడుమలు వచ్చినను శ్రీరామనామస్మరణమును మాత్రము విడువ వల దనియు శత్రుమిత్రులయెడ సమభావంబున మెలంగుమనియు సమలోష్టకాంచను డవును నీమణత్రయ దూరుండవును నగు మనియు నిట్లు మెలంగిన నపవర్గం బరచేత నుండుననియుం జెప్పి హరిభక్తులతో గలిసి యానందంబున శ్రీహరి నిట్లు స్మరిం పందొడంగె నెట్లనిన,

ఆనందభైరవి—ఆట.

ప॥ గోవింద గోవింద । రామగోవింద । గోవింద యోగో విందగోవింద॥

అ॥ గోవిందామృతము నే । గ్రోల్లగా భక్తులతో । నారా గింపగల్గె । నాహా భాగ్యమేమో । గో ।

అ॥ సూర్యవంశజ రామ । సురనుత శ్రీరామా । గరుడ గమనహరి । గంగాజనక ॥ గో ।

చ॥ మచ్ఛమై జలధి । జొచ్చి సోమకు ద్రుంచి । తెచ్చి వేద ము లజున । కిచ్చిన యచ్యుత॥ గో।

చ॥ మందరగిరిధర । మధుసూదన శౌరి । యిందిరా ధవ గోవిందా మురారీ ॥ గో ॥

చ వాసుదేవ కృష్ణా । వనమాలధర శౌరి । దాసులమగు మ్మము మోసపుచ్చకుమయ్య ॥ గో ॥

చ వెంకటదాసుని । సంకటములబాపి । శంకలేక బ్రోవుము శంఖుచక్రధర ॥ గో ॥

చ। ధరను జనార్దన పురవాస శ్రీరామ । సరగున భక్తుల। గరుణతో బ్రోవర ॥

వ ఇట్లా భక్తులతో పరమానందంబున మేను పులకరింప శ్రీహరిని స్మరింపుచు నాడుచుబాడుచు తన నివాసంబునకు జననంతి వెంకటదాసుండు శ్రీరాముని మందిరంబునసే శ్రీహరి నిట్లు స్మరింపు చుండె. ఎట్లనిన,

కం॥ నారద వంద్యా శ్రీహరి।
వారణ పరిపాల సుజన పాలనశీల।
భారము నీదే బ్రోవగ
నీరజదళ సదృశయన నీరధి శయనా ॥

సావేరి-ఆటు.

ప॥ సాధువు నాకివ్వు డాది తారకము బోధపరచెను విను మనసా ॥

అ॥ వేదములకు నది మూలమనుచు నే। శోకము లేని యచల మనుచును ॥ సాధువు ॥

చ॥ పరిపరివిధముల । భవుడు స్మరించె । పావన మంత్రిం బిదియ యనెగా । స్థిరమతి మున్మని ।శింవాలు నుడువగ । నియువుగ గాచిన దిదియ యనెగా ॥ సా ॥

చ॥ పృథివి నంతటను గుదురు జేసికొని కదలకున్న దీతారక
మురా | అదరిపడుచెప్పుడు హరిహరీ యనని | యంధులు
గన రీతారకమురా ॥

చ॥ పాపల నడుమను | వ్యాపించిన యా ఆపోజ్యోతియ
తారకమురా | చూపును మనసొక రూపము జేసిన దాప
గునని నీ తారకమురా ॥

చ॥ సరస్వతి సేవయ| కరుణను జెప్పెను| సర్వముదెలియగ
తారకము | స్థిరమిదె గురుసిదె యనుచురా |
స్థిరమతితో స్మరియింపు మనేరా ॥ సా ॥

వ॥ అనుచు బరమానందంబున మరల నిట్లనియె.

కం॥ హరిని స్మరింపని మనుజులు
హరినిం గన లేరి కెప్పు డవనీస్థలిలోన్
హరిని స్మరించిన జనులకు|
హరిదర్శన మిచ్చి బ్రోచు నతిమోదమునన్

నాదనామక్రియ — ఆట.

ప॥ జీవుడ గోవిందయనరా | జీవా గోవింద నామా
మృతము గ్రోలు మెపుడు ॥ జీ ॥

చ॥ శ్రీరామనామ | సుస్థిరముని భువి వెద |
జల్లె చిన్మయుడు సద్గురు చూపులో |
తల్లగ దీనామ యుల్లాసమున వేడు |
మళ్లి జన్మానికి మరలి రానేరావు ॥ జీ ॥

చ॥ పంచకోశా తీత మాయ యుండి యెపుడు ప్రి । పంచ జీవుల బ్రోచే దీనావను । మంచి జపము సేయ సంచితముల బాపు చంచల ముడిగి నీవు । మంచి మనసును ॥ జ ॥

చ॥ సూరిజనులు సిద్ధ । సురలు మును లెపుడును। సూటిగ స్మరియించె దీనామము । క్రూరమగు లోభ కామ । క్రోధాదుల జయించి । మేరదప్పక నీవు మేలైన గురితో ॥ జీ ॥

చ॥ ధరలో జనార్దన పురమున వెలసిన । హరిని సద్భక్తుని స్మరియించ నతడు । కరుణ జూపును జనుల । గాచుచుండు నమ్మ మరువకుమా శ్రీహరిని మదిలో నెల్లప్పుడును ॥ జీ ॥

వ॥ ఇట్లు బోధింపుచు పరమానందంబునం జొక్కుచు నిట్లని పాడం దొడంగె, నెట్లనిన

ఆనంద భైరవి. ఆట.

ప॥ ఆనంద మానందము । పరమానంద । మానందము ఆనంది వాహను । డానందమున నుండు । శ్రీనామ మొప్పుడు । చిత్తమందుంచు లే ॥ యా ।

చ॥ కుంజరేంద్రుపైన । కెదురుగ బవళించు నందజ వాహుని యాశ పాడుచుంట ॥ యానం ॥

చ॥ కృష్ణా కృష్ణయనిన । గష్టముల దలచు శ్రీకృష్ణుని సతతము గీర్తన సేయుటయే ॥ యా ॥

చ॥ పశుపతిని బ్రోచిన। పరమపురుషు నెపుడు। వశునిగ జేసు
కొని। వదలకుండుట॥ బ్రహ్మానంద॥

చ॥ ధరలో జనార్దన। పురవాసుడౌ హరిని। మరువక నెల్ల
పుడు। మదిని స్మరించుటయే॥ యా॥

వ॥ అనుచు వెంకటదాసుం డనవరత ముఖ్యంపిరానాధుని
డెందంబునం బొందుపరచి యానందాతిరేకంబున తన
డెందంబునకు బోధసేయుచు సచ్చేటు వాసి నిజమంది
రంబునకుం జని మరల నాగోవిందుని స్మరింపుచు నిట్లనియె.

కం॥ జీవుడు దేవుండనుచుం
గావరమున నుడువుసంత కరివరదుండా।
జీవుండగు నాయవురా।
జీవులకు సతతమైన చిన్మయు డనగా।
జీవుల బ్రోచెడు హరికిని।
జీవుడ దాసుండవగుచు జేరుము భక్తిన్॥
కావరముల నడగింపుము।
భావమునను బూజసేయు మతని యడుగులన్॥

సావేరి-ఆది.

ప॥ తారకబ్రహ్మము నేనే యనినను। తద్గుణము భుక్తిమాన
వలెన్॥

అ॥ కోరికలెల్ల నశింప జేసి పైకొండగుహను తానుండవలెన్॥
చ॥ నిరాకారుడను నేనే యనినను। నిర్గుణిమై తానుండవలెన్

నిరాకరింపుదు నీవ నేననుట । నిశ్చయ చిత్తమునిల్ప వలెగా ॥

చ॥ అహం బ్రహ్మాస్మియను భావంబున్నను । నచలముగా నేయుండవలెగా ॥
ఇహపర సౌఖ్యములెల్లను గోరక । నెప్పు డరూపత నుండవలెగా ॥

చ॥ దండిగ వెంకటదాసుండెప్పుడు । తారకబ్రహ్మమేననవలెగా
కుండలియందున నగనముతాముని । గురిగానిల్పి స్మరింపు కొనెగా ॥ తా ।

వ॥ ఇట్లు వెంకటదాసుండు నేన తారకబ్రహ్మమని తలంపక రాజు భృత్యన్యాయంబున శ్రీరాముని భక్తి భావంబున సేవింపుచు మున్ను శ్రీరామచంద్ర సహారవిందానవరత ధ్యానంబున బ్రహ్మైక్యంబై భుక్తిమాని ముక్తి నపేక్షింపుచు గోళ్కలుడిగి ప్రపంచంబు మరచి జీవుని సహస్రారంబున జేర్చి వ్యాపవలె జలింపకను న్న వాల్మీకి చందంబున నుండుచును వశంబుగాక చావుం బుట్టుకయు లేని జీవనమాధినిష్ఠ దెలియజాలక దుష్కామంబుల నశింపంజేసి సద్గోష్ఠిచే మెలంగుచు భగవద్ధ్యానానుభవంబున మేను మరచుచు శ్రీహరి సాక్షాత్కరించినట్లు శరీరం బుప్పొంగ నృత్యంబు సల్పుచు.

కం॥ జూపర కరుణా దృష్టిగా
వేడర నేపముల నెపుడు విశ్వాత్మకనీ ।

కాదర నిను వీడర కా ।
పాదర రాసేర భక్తపాలనశీలా॥

వ॥ ఇట్లుప్పొడు భగవంతుని స్మరింపుచు పరమానందంబున నుండు మరియు.

కం॥ ఈ తారకచరితంబును ।
చేతోమోదంబుతోడ జెప్పిన విన్నన్ ।
ఖ్యాతిగ వ్రాసినవారు బు
నీతులగుచు బొందగల రనేకసుఖంబుల్ ॥

కం॥ సీతారామాహాది యం
చీతీరున వేడుకొనిన నీసుచరిత్రం
బే తారకపద మొసగుచు
నాతావార్యముగ దిశలయశముప్పించున్ ॥

కం॥ నారాయణ యని యెపుడున్ ।
బారాయణ సేయువారి గాధలు యూన్పన్ ।
కోరిన కోరికలిచ్చున్ ॥
భూరిదయ నృసుపుశౌరి పుణ్యులసేయున్ ॥

వ॥ ఇట్లు రమ్యంబుగ దెలియంజెప్ప నాపుణ్యపురుషుండు విని విస్మయానందంబును జెందుచునుం జేవగొన, మా యీ కే వెంకటదాసుండెంతయు పుణ్యాత్ముండని యగ్గింపుచు నింటికిం జనికొ సంత దర్శన జనులును వారివారి నిజ నివాసంబులకుం జనిరి.

మాలిని నిరుపమ గుణజాలా । నిత్య కల్యాణ శీలా ।
కరపరివృతపాలా । కాంతి మత్స్వర్ణవేలా ।
ఖరదనుజవిశాలా । ఖండితాఘౌఘమాలా ।
సరసహృదయలీలా । జానకీ ప్రాణలోలా ॥

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ ।
మహనీయ గుణాత్మనే
జొన్నపాటి నివాసాయ
దేవ దేవాయ మంగళం ॥

గద్యము. ఇది శ్రీమద్రాజ్ఞన పురావాస నియోగాంధ్ర
శ్రీరామచంద్ర కటాక్ష పాత్ర వెల్లశి గోత్ర పవి
త్ర సుజని జగన్నాథ కొండపల్లి స్వామిం
బుధ రాకాపూర్ణ నవనీత రామగోవింద
రెడ్డి తనూభవ దేవారెడ్డి ప్రపౌత్ర
వీరారెడ్డి పౌత్ర తాతిరెడ్డి
పుత్ర వెంకటగారు విరచి
తంబగు నీ తారకనామ
ప్రభావంబను
యక్షగాన
ప్రబంధము
సంపూర్ణము.